# సమాలోచన

జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

సంపుటము 1 రాజమహేంద్రవరము 16-11-1977 సంచిక 2





1, 16 తేదీలలో ప్రచురింపబడును.

చందా

సంవత్సరమునకు రు 10-00.

అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.



## —* ఈ సంచికలో *—




| | |
|---|---|
| సూర్యరాయాంధ్ర నిఘంటువు - పునర్ముద్రణము | 1 - 2 |
| మన దేశరక్షణ | 3 - 8 |
| సంస్మరణము | 8 - |
| గ్రంథ సమాలోచన | 9 - 12 |
| సమాలోచన ఆవిష్కరణోత్సవ సభ | 13 - 14 |
| పల్వెల కొప్పులింగేశ్వర స్తుతి | 15 - 16 |
| శ్రీ భారతాంబ దాస్యవిమోచనము - గ్రంథ విమర్శ | 17 - 19 |
| ఈ పత్రంలో... | 20 - 21 |
| సమాలోచన - శుభాకాంక్షలు | 22 - |
| రచయితలకు | |


* ప్రకటన రేట్ల వివరములకు సంపాదకులకు వ్రాయవలయును.



# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు - పునర్ముద్రణము



పిఠాపురం మహారాజావారి మహౌదార్యముతో 1930 లో ఆరంభింపఁబడి, అనేక పండిత ప్రకాండుల నిరంతర కృషితో కొనసాగింపఁబడిన పై నిఘంటువు 'అ' నుండి 'న్ర' వఱకు 1949 నాటికి నాలుగు సంపుటములుగా ప్రకటింపఁబడినది. జమీందారీల రద్దు మున్నగు కారణములచే అనంతరము నిఘంటు కార్యాలయము ఎత్తివేయఁబడినది.

సువిశాలమైన వాఙ్మయ సముద్రమును మథించి పండిత శిఖామణులు చాలవఱకు మిగిలిన సంపుటముల వ్రాతను పూర్తిచేసియుండిరి.

తరువాత శ్రీ గిడుగు వేంకట సీతాపతిగారి కృషివలన 5, 6, 7 సంపుటములు వెలుగుచూచినవి. అంతటితో 'ప' నుండి 'వ్రై' వఱకు పూర్తియైనది. 'శ' నుండి 'హ్వా' వఱకుగల 7 వ సంపుటపు అనుబంధము 1972 లో ముద్రణపూర్తినొందినది. ఈవిధముగా నీనిఘంటువు సంపూర్ణరూపము సంతరించుకొన్నది. ఈఅనుబంధ మిట్లు ప్రచురింపబడుటలో ఉద్దండపండితు లనేకుల హస్త మున్నట్లు ఆ అనుబంధపీఠిక వలనఁ దెలియుచున్నది.

లక్షలకొలది ధనము వ్యయమై, సంవత్సరముల తరబడి మహాపండితు లనేకుల దీక్షతో రచింపఁబడి వెలువడిన యీనిఘంటువు సర్వసమగ్రముగను, సప్రమాణముగను నుండు టత్యంత సహజము. శబ్దస్వరూప నిర్ణయములో, చక్కని పెక్కు ఉదాహరణములతో, నిది చిన్నతరహా విజ్ఞానసర్వస్వమువలె వాఙ్మయోపాసకుల కత్యంతోపకారకమై వెలయుచున్నది. ప్రాచీన కవితావైభవము నర్థము చేసికొనుట కుపకరించు నిట్టి బృహద్గ్రంథము వెలువడుటకుఁ గారకులైన మహారాజావారి కీర్తి యజరామరము. పండితుల కృషి అత్యంత శ్లాఘాపాత్రము.

సంపుటముల మధ్య ప్రచురణకాలవ్యవధి అధికముగ నున్న కారణమున నిపు డన్ని సంపుటములు లభ్యమగుటలేదు. ఉన్న కొన్ని సంపుటములైనను వెంటనే వెలయిచ్చి తీసికొనుటకుఁ దగిన సౌకర్యము లేదు.

అన్ని సంపుటములును ప్రభుత్వపక్షమున పునర్ముద్రణము గావించి ప్రచురించుటకు ప్రయత్నములుజరగుచున్నట్లు వినుచున్నాము. ఆ కృషి జయప్రదమై అన్నిసంపుటములు నేక కాలమున లభించు నేర్పాటు జరగినచో మన ప్రభుత్వము వాఙ్మయమునకు మహోపకారము చేసిన ట్లగును.

అట్టి పునర్ముద్రణము విషయమున నొక్కసంగతి గమనింపవలసి యున్నది. భ్రమ ప్రమాదములు మానవసహజములు గనుక నచటనచట కొన్ని చిన్నపొరపాటులు దొరలియున్నవి. ముఖ్యముగా 5, 6, 7 సంపుటములలోను, మఱింతగా 7 వ సంపుటపు అనుబంధమునను నవి తొంగిచూచుచున్నవి. కొన్ని ముఖ్యములైన పదములే గృహీతములు కాలేదు. అకారాదిక్రమము తప్పినచోటులును గలవు. మొదటి సంపుటములలో పాటింపఁబడిన క్రమము చివరివఱకు ఒకేరీతిగా పాటింపఁబడలేదా యనిపించుచున్నది. వీని ముద్రణకుఁ దోడ్పడిన వారందఱు ప్రముఖ విద్వాంసులే ఐనను పూర్తిసమయము నీకార్యమున వినియోగించు ఏర్పాటు జరిగియుండనందున ఈ యటువంటి దోషములు మిగిలి యుండవచ్చును.

మొదటి సంపుటముల నిర్మాణమునఁ బనిచేసిన ప్రముఖపండితులలో శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, శ్రీ బులుసు వెంకటేశ్వరులు, శ్రీ దుప్పూరి సూర్యనారాయణశాస్త్రి, శ్రీ చిలుకూరి వీరభద్రశాస్త్రి మున్నగువారు కొంద ఱిప్పటికి సోత్సాహులై యున్నారు. వారిలో కొందఱు విశ్రాంతజీవితము గడపుచును ఉన్నారు. అట్టివారి సహకారమును స్వీకరించి, పొరపాటులను సవరణచేయించి, ముద్రించినచో నీ నిఘంటువు మఱింత తేజోవంతమై వెలయఁగలదు. *



# మన దేశరక్షణ

అనువాదకులు : శ్రీ సి. నరసింహాచార్యులు, ఎం. ఏ., ఎమ్. యిడి., బి. ఎల్.
మూలరచన : కీ. శే. డాక్టరు డి. యస్. రాజు (కల్నలు రాజు)
మాజీ కేంద్ర ఉపమంత్రి.



ప్రపంచమునందెల్లెడలను కయ్యమునకు కాలుదువ్వు మన స్వత్వముతో దేశము లన్నియు బిగిసిపోవుచున్నవి. మన పొరుగుదేశములు తమ ఆయుధబలమును, సైన్య బలమును సర్వవిధముల అనువు చిక్కినదే తడవుగ తమ శక్త్యనుసారము పెంపొందించుకొనుచునే యున్నవి. మనదేశమున ఆంతరంగిక కలహములు మన ఉనికికే భంగము కలిగించుచు బెదరించుచున్నవి. ఈపరిస్థితు లన్నిటిని దృష్టియం దుంచుకొని, ఏమరుపాటు వీడి గమనించినచో మన దేశసంరక్షణకై మన మాచరింపవలసిన కృషి సమస్యపై దేశమంతయు దృష్టి కేంద్రీకరించుట తత్క్షణకర్తవ్యమై యున్నది.

మన దేశరక్షణ, మన విదేశసంబంధ విధానములో నొక సమగ్రభాగమై యున్నది. శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ అతిసమర్థతతో, పంచశీల సిద్ధాంతముపై నాధారపరచి మన విదేశవిధానమును నిర్మించిరి. శత్రువులు లేకుండుటయు, మనతో నెప్పుడైన ఘర్షణకవకాశముండు దేశములతో విశ్వసనీయమై చిరస్థాయియైన స్నేహ సంబంధము నేర్పరచుకొనుటయు, దేశరక్షణవిధానమున నత్యుత్తమమార్గ మనుట నిర్వివాదము. మనకున్న ముఖ్యమైన సమస్యలకు పరిష్కార మేర్పరచుకొనుచు, రాజకీయసంబంధములలో నీ విధానమును నిరంతరము ఆచరించుచుండుట మన ప్రభుత్వమునకు ముఖ్యమైనవిధి. అట్లున్నను సైన్యాధికారులుమాత్రము ఎప్పటికప్పుడు యుద్ధసన్నద్ధులై, ఆయుధములను సమగ్రముగ సమకూర్చుకొని యుండవలసినదే. ప్రపంచమున శాంతికాలము వెలయుచున్న దనగా; నానాదేశములు యుద్ధమునకు తమ ఆయుధబలమును, సంపత్తిని, సమకూర్చుకొనుచున్నవనుట యుద్ధశాస్త్రమున నొక ముఖ్య సిద్ధాంతము.

యుద్ధము వినాశనకారియైన యొకక్రీడ. అందును నేటి మారణాయుధయుగమున, ఈ అణుబాంబుల కాలమున నది మరింత దురంతమైనది. శాంతిని నెలకొల్పు ప్రయత్నములో, దేశగౌరవమని, ప్రతిష్ఠయని, అడ్డుపుల్లలు వేయరాదు. మనకుగాని, మరియేయితర దేశమునకుగాని, ఆయుధవిసర్జన మొక్కటే శాంతికి ఏకైకమార్గము. కాని అట్టి సుఖప్రదమైన భవిష్యత్తునకు ఎట్టి సూచనలుగాని, ఊహించుట కవకాశ పరిస్థి

తులు గాని ఎచ్చటను కానరాకున్నవి. అట్టి తరుణమున మన ప్రభుత్వ మాచరింపవలసిన విధి సుస్పష్టము. మన దేశమున ప్రతిప్రాంతమున రక్షణకు ఏర్పాట్లు చేయవలసియున్నది. మన ప్రభుత్వ మీవిషయమున విఫలమైనచో తన అధికారమును గోల్పోవుటే కాక మనదేశము తక్కినదేశములతో కలసి మెలసి, శాంతియుతముగ మనుటకుం గల అవకాశములను భగ్నముచేయు పరిస్థితులను కల్పించును.

మనము ఉద్ఘాటించిన విదేశీయవిధానముతో సమన్వయము కలుగునట్లును, మన దేశీయ సాంస్కృతిక సంప్రదాయములకు భిన్నము కాకుండునట్లును, మన రక్షణ విధానమును నిర్ణయించుకొనవలెను. దీని ననుసరించియే ఎట్టి అధిక సంఖ్యాక - దాడినైనను ఎదిరించి త్రిప్పికొట్టఁగల సామర్థ్యమును సమకూర్చుకొనవలెను. దీనినిబట్టి మన సైన్యముకాని, విమానదళములుగాని మన సరిహద్దులు దాటి పొరుగువారి ప్రదేశములలో ప్రవేశించుటలో మొదటివి కాగూడదు. సిద్ధాంతము ననుసరించి, పరులను ఎదిరించుటే రక్షణకు ఉత్తమమైన మార్గము. కాని నేటి అణుశక్తియుగమున, మారణ మహాయంత్ర కాలమున నీసిద్ధాంతము విఫలమైనది. కావున రక్షణబలమును వృద్ధిచేయు మార్గమువలననే శత్రువును బాధించుట ఉత్తమమార్గమై యున్నది. రక్షణకు చేయు సన్నాహములు నిర్ద్వంద్వముగ నుండవలెను. యుద్ధమున సర్వము నూటిగా నుండవలెను. ఏదిచేసినను సంపూర్ణముగ నుండవలసినదేకాని లోభకారణమున కక్కురితి మార్గమున నుండరాదు. దేశప్రజ అందరును ఏదోయొక విధముగ నీకార్యక్రమమున నిమగ్నులు కావలసినదే. యుద్ధమునకు దయాదాక్షిణ్యము లుండవు. కావుననే దేశప్రజ అందరును, అందును ముఖ్యముగా విద్యార్థికులు, మన ప్రయత్న విధానములను కార్యక్రమములను, వానివలన నుద్భవించిన పరిణామములను కాలక్రమమున గలుగు ఫలితములను, గూర్చి సంపూర్ణముగ తెలిసియుండవలెను. అట్లున్నప్పుడే, మనకు మన దేశీయ ప్రజలనుండి, సంపూర్ణముగాను, హృదయపూర్వకముగాను, సహాయ సహకారములు లభించునను విశ్వాసము కలుగును.

పూర్వపు యుద్ధవిధానమునే యవలంబించుచు, మహాసైన్యమును సమకూర్చుకొనుటయా? లేక ఆధునిక పద్ధతులపై శాస్త్రీయవిధానమున ఆయుధ సామగ్రిని సమకూర్చుకొని, స్వల్పసైన్యముతోనే సరిపెట్టుకొని యుండుటయా? యను విషయమున యుద్ధనిపుణులైన నాయకులయందే ఏకాభిప్రాయ మింతవరకు నేర్పడలేదు. ప్రపంచమున నగ్రశక్తులైన (రష్యా, అమెరికాలు) దేశములు ఈవిషయమున తుదినిర్ణయమునకు రాలేదు. కావుననే ఇరుదేశములవారు ఒకవంక లెక్కలేనంత సైన్యమును సేకరించుచు, వేరొకవంక అధునాతన యంత్రములతో నిర్మింపబడిన మారణ యంత్రములను నిరంతరము సేకరించుచునే యున్నారు. ఇరుదేశములవారును తమ శాస్త్ర పరిజ్ఞానమునంతను వినియోగించి కర్మాగారములలో నాయుధములు నిర్మించి గుట్టగుట్టలుగ పోయుచున్నారు.

హైడ్రోజను బాంబులు మొదలైన వానితోసహా ప్రపంచమునంతను అనేక పర్యాయములు భస్మముచేయగల ఆయుధసామగ్రి వారివద్ద నున్నది. కావున వారు పూర్వకాలపు యుద్ధపద్ధతిని గాని, ఆధునిక విధానమునగాని, యుద్ధమునకు సంసిద్ధులై యున్నారు.

పాకిస్తాను, చైనాదేశములు, ఒక్కొక్కటిగా గాని, ఉమ్మడిగా గాని మనపై దాడిచేసినచో మనమనుసరింపవలసిన యుత్తమమార్గమేమి? యన్నదే మనసమస్య. అగ్రరాజ్యములు మనకెట్టి సహాయము చేయునని కాని, వారి ప్రవర్తనా విధానమేమని కాని, తర్కించక; మనకాళ్ళపైనే మనము నిలువవలసియుండినచో, మనము దానికిసంసిద్ధులమై మన ఏర్పాట్లు మనముచేసికొని. అట్టిముట్టడికి సర్వసన్నద్ధులమై యుండవలెను. మనము మనలను రక్షించుకొనుటకు సమర్థులమే. మనకు కావలసినంత సాయుధబలమున్నది. సైనికులు తమలోని క్రమశిక్షణను, తరిఫీదును ఇదివరలో నిరూపించుకొనియున్నారు. వారి ధైర్య సాహసప్రవృత్తికి మనమెంతయో గర్వించవలసియున్నది. యుద్ధసైన్యాధికారులు అసంఖ్యాకమైన పరిస్థితులలో నెట్టి అగ్నిపరీక్షకైనను నిలిచి పేరెన్నిక గన్నవారు. మనకెందరో మేధావంతులైన వారును, శాస్త్రపరిజ్ఞానము గలవారును, మార్పుచెందుచున్న ఆయుధ నిర్మాణరహస్యములు తెలిసినవారును నున్నారు.

సైనికబలమెంత తోడైనను, దేశీయులెంత కృతనిశ్చయులై ఆత్మశక్తిగలవారైనను ఈయుగమున ఆయుధబలమే, అందును ప్రత్యేక పద్ధతులపై నిర్మించబడిన ఆయుధబలమే జయాపజయములను నిర్ధారణ చేయుచున్నదనుట సర్వవిదితము. ఆ శక్తి దేశచరిత్రలనే మార్చివేయుచున్నది. ఆయుధబలము వల్లనే జయముపొందిన సంఘటనలెన్నోయున్నవి. మొదటి ప్రపంచసంగ్రామమున టాంకుల ప్రభావమును, రెండవయుద్ధమున విమానబలము, ఆటంబాంబుల శక్తియు, అగ్రరాజ్యముల విధి వ్రాతను నిర్ణయించినవి.

యుద్ధకాలమున సైన్యములు, టాంకులు, భారమైన ఆయుధవాహనములు, విమానదళము, ముందునకు త్వరితగతిని పోవలెనన్నచో; క్రమపద్ధతిలో నిర్మించిన రహదారిమార్గములు లేనిదే వీలుపడదు. దీనికి రాదారులుకూడ అతిముఖ్యములు. సైన్యమును ఆయుధదళ రక్షితమైన వాహనములలోనే స్థలాంతరములకు పంపవలసియుండును. వీనిలో నేదిలోపించినను నేటి సైనికదళము ఆత్మనాశకారి యగును. నేడు యుద్ధములు అక్షరాల, చక్రములపైని, రెక్కలపైని, జరుగుచున్నవి. సైన్యములను త్వరితగతిని ఆయాచోట్లకు పంపుట అతిముఖ్యము. అనగా రైలుమార్గములు, రోడ్లు, విమానములు ననువానిమూలమున సైన్యరవాణా జరుగవలెను. జంతువుల సహాయమున రవాణాకూడ విస్మరింపరానిదే.

రవాణా విధానములు, రహదారులును సక్రమముగ నిర్మించుకొన్నవారికే యుద్ధములలో జయము కలుగు నని నూటఏబది ఏండ్లకు పూర్వము నెపోలియను చెప్పి

యున్నాడు. అది నేటికిని సత్యమే. రవాణాకు అనువగు సర్వమార్గములు సైన్యాధికారములో నుండవలసినదే. అనగా ప్రజాసామాన్యమున కేర్పడిన రైల్వేలు. విమానములు, విద్యుత్ కర్మాగారములు, తదితర కర్మాగారములు అతిస్వల్ప వ్యవధిలోనే సైన్యాధికారుల వశము చేయుటకు అనువగు రీతిగా నిర్మించుకొనవలసియున్నది. ఈ రహదార్లు, రవాణామార్గములు, అన్నియుగాని, అధికభాగముగాని, శత్రువుల దాడిచే నాశనముచేయబడును. విమానములు సులభముగ దిగుటకు సిమెంటురోడ్లు దేశమునందంతటను, ఎన్నోచోట్ల నిర్మించవలెను.

ఈ కార్యక్రమములో నతిముఖ్యమైనది శతఘ్నులతో కూర్చి నిర్మించిన విమానదళము. ఈ దళము సాధ్యమైనంతవరకు శత్రువుల విమానబలమునకు సాటియగునదిగా నుండవలెను. వీటిలో పెక్కు రకము లున్నవి. మైరేజ్ ను పాకిస్థాను ఫ్రాన్సునుండి సంపాదించుచున్నది. ఇది F 104 కన్నను, అమెరికా వియత్నాములో నుపయోగించిన ఫాంటంలకన్నను మిన్నయైనది. ఇది రక్షణకు అనువై; తక్కువవ్యయముతో పని చేయ వీలుపడును. దీనిని నడుపుటకు స్వల్పసంఖ్యలో నిపుణులు సరిపోవుదురు. బాంబరు విమానము శత్రుసైన్యనాశనమునకే యుపయోగపడును. కాని ఇది నాశనమైనచో నధికనష్టము. దీనిపై పనిచేయుటకు విమానమునకు పదిమంది యవసరము. ఇది సర్వసాధారణముగా శత్రువులచే భేదించబడుచునే యుండును. అనగా మనకు కొన్నివేల సంఖ్యపై విమానదళము పురోగమించుచున్న కాల్బలమునకు ఎంతో సహాయకారిగ నుండును మన సముద్రతీరమునంతను సురక్షితముగా నుంచగలదు. అప్పుడు సముద్రతీరములం దుంచబడిన అతిదూరవస్తు భేదనమునకై ఏర్పరచిన శతఘ్నులు నావికాదళమును రక్షించుటకు వీలగును.

ఓడలను భేదించు టార్పెడోబోట్లు ఎంతోవిలువైనవి. వాటిని తయారుచేయుటకగు వ్యయముస్వల్పము. వాటిని ప్రయోగించుటకూడ సులభమే. మన సముద్రతీరమునంతను రక్షించుకొనుటకు ఈ ఆయుధములు మనకు ఆదర్శప్రాయమైనవి. గణనీయమైన నావికా దళమును ఏర్పాటుచేసికొనుట మనకిప్పుడు సాధ్యముకాదు. ఇది దీర్ఘకాలిక ప్రణాళికలో చేర్చదగినది.

హెలికాప్టర్లుకూడ ఫైటరు విమానములంత ముఖ్యమైనవే. ఇవి నేలపై దిగుటకు విశాలప్రదేశ మవసరము లేదు. తేలికయైన సామానులను తీసికొనిపోగలవు. సైనికులను ఎచ్చటికైనను శీఘ్రముగా కొనిపోగలవు. యుద్ధమున క్షతగాత్రులైనవారిని త్వరితముగ తీసికొనిపోగలవు. వీనివలన 10%కు పైగా మృత్యువునుండి రక్షింపబడుచున్నారు. రాడారుచే నివి కనుగొనబడవు. మనము అణుబాంబులను సేకరించక పోయినను, అగ్రదేశముల సహాయము కోరకపోయినను, కనీసము మన ప్రజలను రక్షించుకొనుటకైనను ఏర్పాట్లు చేయునిందు.

పైవిధముగా దేశప్రజల రక్షణకై సమగ్రమైనఏర్పాట్లు చేయుటకు పనిం బూనవలెను. ఆ కార్యక్రమమును తత్ క్షణమే ఆచరణలోనికి తేవలెను. ఈకార్యక్రమము చాలకాలముక్రితమే పూర్తిచేసి యుండవలసినది. ఇప్పటికైనను కాలముమీరిపోలేదు. ప్రతిగృహమందును సిమెంటుతో రక్షణగృహములు నిర్మించుట, కొంతకాలమువరకు సరిపడు ఆహారపదార్థములను సేకరించి జాగ్రత్తచేయుట, ప్రత్యామ్నాయ పద్ధతులలో నీటివసతుల నేర్పరచుట, నూతులు త్రవ్వించి యుంచుట, బాంబులుపడు సమయములలో ప్రజానీకమును పల్లెలకు తరలించుటకు ఏర్పాట్లును, కావలెను. లోయలు, పర్వత సానువులు, క్రిందిభాగములు, కొండగుహలు, సొరంగములు ఉపయోగములోనికి తెచ్చి ప్రభుత్వ కార్యాలయములకు ప్రత్యామ్నాయ ప్రదేశములను తత్ క్షణోపయోగములోనికి తెచ్చునట్లు చేయవలెను. పౌరులకు ధైర్యము కలిగించి అల్లకల్లోలములో పడకుండ చేయుట కవి సర్వథా ముఖ్యమైనవి. ప్రజాబాహుళ్యములో భయవిహ్వలత కలుగకుండ చూడవలెను. శత్రువులు విమానములనుండి బాంబులు విసరి ప్రజలను కలతపరచినపుడు ప్రభుత్వము శత్రువశమగుటే మేలు. ప్రభుత్వము లొంగిపోవుటకు ప్రజలు బలవంతము చేయవలెను. సింగపూరు వీధులలో ఏడు దినములు యుద్ధము జరిగినపుడు ఈపరిస్థితులే ఏర్పడినవి. పౌరులు 40 వేలమంది చనిపోగా, ఇరుపక్షములవారును సైనికులు 10 వేలమందియే మరణించిరి. అపుడు ప్రజల బలవంతముపై సింగపూరు ప్రభుత్వము జపాను సైన్యాధికారి వశమయ్యెను. అటంబాంబులతోడియుద్ధమున జయమునగా, మనము మనప్రజలను మృత్యువువాతబడకుండ రక్షించుకొనుటే. వీరితోపాటు శాస్త్రీయజ్ఞానమును, పరికరములను, కూడ వీలైనంతవరకు రక్షించుకొన్నచో, యుద్ధానంతరము జీవితమును పునఃప్రతిష్ఠ కావించుకోవచ్చును.

రక్షణావసరములను విధానమును విపులీకరించుటకు చిన్న వ్యాసమున వీలుపడదు. కొన్ని ముఖ్యవిషయములను నొక్కిచెప్పవచ్చును. మానవుని మేధాశక్తి యనంతమైనది. మానవుడు చంద్రునిపైం గాలిడినాడన్న, అతడు విజ్ఞానశాస్త్ర సహాయముతో చేయలేని దేమున్నది? ప్రపంచము నంతను నాశనము చేయుటగాని, స్వర్గతుల్యముగా చేయుటగాని అతనిహస్తగతమైయున్నది.

రెండవ ప్రపంచయుద్ధమునకు కొంచెము ముందే వాట్సన్ వాన్ మహాశయుడు రాడారుయంత్రమును కనుగొనెను. దీనిని సముద్రతీరమందు నెలకొల్పుటచేతనే జర్మనీతోడి యుద్ధమున ఇంగ్లండు బ్రతికి బయటపడినది. అట్లు కాకున్న యుద్ధానంతరము బ్రిటిషుచరిత్ర ఎంతయో భిన్నముగా నుండెడిది. వేరొక యుదాహరణము. యుద్ధములో జర్మనీపై బాంబులవర్షము కురిపించరాదని బ్రిటిషు విజ్ఞానశాస్త్రవేత్తలు చర్చిలునకును, సైన్యాధికారులకును, సలహా ఇచ్చిరి. ఎంతో వారించిరి. దీనివలన నష్టముతప్పదనిరి. అట్లేజరిగినది. ఈబాంబుల వలన 5 లక్షలమంది జర్మనులు, మరణిం

చిరి కాని మిత్రమండలికి లక్షఅరువదివేల విమానములు నాశనమయ్యెను. వాటిని నడుపు చోదకు లంతేమందిరి. జర్మనులు మాత్ర మొక్క అడుగైనను జంకలేదు. విజ్ఞానశాస్త్రజ్ఞుల అంచనా ఎంతయో సరిగా నున్నది గదా!

Electronic కంప్యూటర్లను కనిపెట్టుటతో నావికాదళము వారి శతఘ్నుల ప్రయోగము అత్యంత సులభమును గురి తప్పనిదియు నగుచున్నది. ఈ కంప్యూటర్లు రాకపూర్వము నూటికి పదిసార్లయినను గురి తప్పిపోయెడిది. కనుక ఆయుధ నిర్మాణ విధానములో శాస్త్రజ్ఞులు కష్టించి పనిచేసి, నూతనమైనవి కనుగొనుటకు తగిన ప్రోత్సాహమును, ఆకర్షణ పరిస్థితులును కలిగింపవలసి యున్నది ఇట్టి ఆయుధములను పరిశోధనాలయములలోను, యుద్ధభూమియందును పరీక్షించి చూచుకొనవలెను. ఇట్టిపద్ధతి ననుసరించుటచే యంత్రముల సామర్థ్యమునందు మనకు విశ్వాసము గల్గును. అంతేకాక ఆయుధములఖర్చులో నెంతయో పొదుపు సమకూడును. సైన్యాధికారులలో స్తబ్ధత, పురోభివృద్ధిని కోరకపోవు మనస్తత్వము, నెంతో నాశనకారి. ప్రపంచ మెంతో త్వరితగతిని దినదినము మార్పుచెందుచున్నది.

నాయకు లందరు ఈమార్పులను ఎప్పటి కప్పుడు తెలిసికొనుచుండవలెను. ఆయుధసైనిక బలములో నైతిక బలమును దృఢపరచి పరస్పరము సానుభూతి ప్రేమాభిమానములు కలుగజేసికొనుచు, ఒకరి ఆదర్శముల నొకరు అర్థము చేసికొనుచుండవలెను. ఒకరి యవసరముల నొకరు ముందుగానే యూహించుచుండవలెను. స్వయముగా విధించుకొన్న క్రమశిక్షణ విధానము ఉత్తమోత్తమము. విప్లవసైన్యము లీపయమున ఎక్కువ అనువును పొందుచున్నవి. నాయకత్వము ఇంకను విపులముగా పనిచేయవలసి యున్నది. సైన్యాధికారి వివేకవంతుడును, ధైర్యశాలియు, నైయుండవలెను. అతడు వివేకవంతుడైనచో అతని అధికారమున నున్నవా రందరకు విశ్వాసము కలుగును. రాజకీయ నాయకునకుకూడ నీన్యాయమే సరిపడును. రాజకీయ నాయకుడు క్లిష్టపరిస్థితులలో ప్రజలలో నుత్తేజము కలిగించుచు నైతికబలమును చేకూర్చును. రెండవ ప్రపంచయుద్ధమున నింగ్లాండు పూర్తిగ నాశనమైనట్లెల్లరు తలపోసిరి. చర్చిలు శంఖారావముతో ప్రజలకు పిలుపు నిచ్చి, ఈతరుణమున బ్రిటను చిట్టచివరివరకు యుద్ధము చేయుననియు, అవసరమైన ముష్టాముష్టి, కేశాకేశి, బాహాబాహి యుద్ధము చేయుదు నేకాని అపజయముతో లొంగిపోవుటమాత్రము జరగదనియు, ఘంటాపథముగ చెప్పెను. ఈ శంఖారావమే నూతనోత్తేజము కలిగించి దేశమును రక్షించినది. కావున సమర్థుడైన నాయకుడే దేశరక్షణము చేయగలుగును. "దేశపూర్వచరిత్రనుండి గుణపాఠము నేర్చుకొనని దేశము, మరల నాపరిస్థితులలోనే చిక్కుకొని నాశ మొందితీరును" అని చెప్పుచు నీ వ్యాసమును ముగింతును.

# సంస్మరణము

— డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు,
ఎం. ఏ., పి. హెచ్. డి.

* శ్రీరామాయణ కల్పవృక్ష మెవఁ డాంధ్రీ సుందరోద్యానమం
దారోపింపఁ దదీయ పద్యసుమ సమ్యగ్భవ్య సౌరభ్య నా
నా రాజ ద్రసముల్ బుధాళి హృదయానందంబు సంధించు నా
గీరూపున్ గవి విశ్వనాథు గవితా కేళీరతుం గొల్చెదన్.

* కవిసమ్రాట్టు, కళాప్రపూర్ణుఁడును, 'డాక్టర్' పట్టభద్రుండు, ప
ద్మ విభూషుండు, మహర్షి తుల్యుఁడును, నాంధ్రప్రాభవాస్థాన స
త్కవి వర్యుండును, జ్ఞానపీఠ కృత సత్కారుండు, బ్రాహ్మీమయుం
డవు నీకున్ నతి విశ్వనాథ కులదీపా! సత్యనారాయణా!

* విశ్వనాథు డొకఁడు విచ్చేసినాఁ డన్నఁ
బ్రాక్తనాంధ్ర సుకవి వర్గ మెల్ల
నొకట వచ్చినట్లు; సుకవితయే వచ్చి
నిలిచినట్లు; రసము పొలిచినట్లు.

* అగసార్వభౌముఁడా యనిపించుఁ దత్కావ్య
భావ సమున్నతి ప్రతిభఁ దలఁప;
అండజనాథుఁడా యనిపించుఁ దత్కావ్య
భావ మహావేగ పటిమఁ దలఁప;
అంబుధి ప్రభుఁ డొకో యనిపించుఁ దత్కావ్య
భావ గాంభీర్య సంపదఁ దలంప;
అహికులపతి యొక్కొ యనిపించుఁ దత్కావ్య
భావ గర్భిత వాక్యపటుతఁ దలఁప;
వల్మీకోద్భవు ధ్వని మహావైభవములు,
వ్యాసభగవాను వైదిక ప్రాభవములు
విశ్వనాథుని కవితలో వెలయు; నతఁడు
సాహితీ విశ్వనాథుఁ డసంశయమ్ము.

* బండ్లకొలఁది చెత్త వ్రాసి పేర్చు నొకండు
రసము చింద సుంత వ్రాయు నొకఁడు
బండ్లకొలఁది వ్రాసి వ్రాసిన దంతయు
రసనిధాన మనఁగ వ్రాసె నితఁడు.

—:0:—

# గ్రంథ సమాలోచన

(ఆంధ్ర కవితాసామ్రాజ్యము. రచయిత శ్రీ నిష్ఠల సీతారామశాస్త్రిగారు. సీనియరు తెలుగు పండితుడు. సంస్థాన బహుళార్థ సాధక పాఠశాల, బొబ్బిలి. వెల రెండు రూపాయలు.)

ఆంధ్రకవితా సామ్రాజ్యము పద్యకావ్య మనుటకంటె పద్యగ్రంథ మనుట యుచితము. ఇందుపద్యములలో కవుల (ప్రాచీనార్వాచీన) మహత్త్వము వర్ణితము. ఇది యొక క్రొత్త ప్రక్రియ. మానవుని బుద్ధి బహువిచిత్రము. ప్రతిదియు సంభావ్యమే. అసంభావ్యమేదియు నుండదు. ఔచిత్యానౌచిత్యములు దేశకాలములను బట్టి వక్తృశ్రోతృసాపేక్షములై యుండును. బహుశః ఇట్టి ప్రకియలకు పితామహస్థానము శ్రీ తిరుపతి వేంకటీయము కావచ్చును.

ఇందుప్రాచీన కవుల మహత్త్వ వివరణము నవీనాంధ్రకవుల మహత్త్వ వివరణముకంటె బృహత్తరమై యున్నది. పద్యములు ధారాళముగ నిరాటంకముగ శ్రవణపేయములై సాగినవి. మానుగ, రమణ, ఆరయ, వంటి పదములును, తరచు సాక్షాత్కరించును. చాలం బద్యములు (37) దొదవుల (85) విశోభంబు (97) విశోభి (139) విలిఖించితివా (131) అద్దానినిన్ (59) వంటిపదములు మనముల నాకట్టుకొనును. దుస్సాధ్యము, (31) దుర్గ్రాహ్యంబు (26) వంటి యవైయాకరణములు, పదిన్నూరులు (రెండువేలను) నర్థమున (32ప) నూనముగా (50) (నిశ్చయమను నర్థమున 'నూనం' అను సంస్కృతావ్యయము) 'సలహా' (62) (అనాంధ్రము) తొంటికైసరుడు (74 ప) (కవీశ్వరుడను నర్థమున) ముప్పూవు లార్గాయలున్ (మూడు పూవులారుకాయలు) వాగ్ఝరీమరంద ధారాసముదార మాధురి (189) వంటి సమాసములు, భక్తిమయ ప్రధాన దివ్యామృత (141) వంటి నిరన్వయములు, ఆధరణీతారక సూర్యచంద్ర ధరణీధ్రంబై (197) వంటి నిరర్థక దీర్ఘసమాసములు, నానానేక భోగాళి (198) వంటి సమాసములు, నీరచన పద్యాల్ (210) మొదలైనవి సహృదయ పాఠకుల నిలిపివేయును.

ప్రవిలసమానమై (99) ప్రవిలసత్ అనే యెక్కువగా వాడుకలోనున్నది. ఒకవేళ లసధాతువు ఉభయపది యేమో? కామరస (103) శృంగారసమున్నది కాని కామరసము వినరాదు. సూత్రావాల అర్థక్లేశము. ప్రౌఢస్త్రీలకుగూడ బడుచుదనము (121) పడుచుదనము లేని ప్రౌఢ లుందురా?, కాలయాప నైకమోదంబు (146) కాలక్షేపమైన యానందమును మాత్రమే కలిగించు ననియేనా యర్థము ? (క్రీడాభి

రామవర్ణనమున) నియంతంబు (22) నియంతృ శబ్దము నియంతయగును గాని నియత మెట్లగును? పండితేతరాజ్ఞానులు (25) ఇందు పదచ్ఛేదము, అర్థము నెట్లు? పండితేతరులు అజ్ఞానులుకారా? రెండు పదములేల?

వాణికి నివాసైక స్థలంబైన చేతను గంటంబు ధరించి (33) సరస్వతి చేతియందే నివసించునా? అదియెట్లు? ముహురుద్భూతి- ముహుః ప్రోద్భూతులున్ (147) ఇట నుద్భూత ప్రోద్భూత శబ్దముల కర్థభేద మేమికలదు? ఏకచ్ఛత్రియై పాలనన్ (166) ఇట ఒకేగొడుగు కలదై యను నర్థమున ణినిన్ చేయుటకన్న 'ఏకచ్ఛత్రమై' అని బహువ్రీహి చేసిన బాగుండునేమో? చుక్కలలో వెలుంగు తారాయుతవల్లభుం బలెన్ (180) ఇట బింబప్రతిబింబభావ మెట్లు? చుక్కలలో ప్రకాశించు తారాయుత వల్లభునివలెనున్న (తారా+అయుత లేక తారా+యుత) రాయలచే ప్రకాశించు పెద్దన-వీరిలో చంద్రుడు పెద్దనయైనచో రాయలు నక్షత్ర సముదాయమువంటి వాడగునా ? మందంబుగా శ్లేష (224) శ్లేష మందముగా నుండుట యనగా శ్లేషము అందముగా నుండుటయనియా? శ్లేష మందముగా నుండుటయనియా వివక్ష?. అశ్లేకవీంద్రకోటి కల్పవృక్షంబుగ (288) కోటికి కల్పవృక్షమా? లేక కోటికి అల్పవృక్షమా? చెట్టొకపిట్టయైనది (260) చెట్టుకొక పిట్టయైన దని భావమై యుండును. తురకప్రభువాహిని (270) సమాసము విచిత్రముగానున్నది. వాగ్లలనా (413) వాక్షులం (279) వాగ్లహరీ (189) శ్రవణకటువులగు సమాసములు. యశోలలనా దివ్యనటీ విహారము (228) లలనాపదము తరువాత దివ్యనటీపద మేలనో ? రీతి వైవిధ్యము (229) రీతిశబ్దము కలదు. రీతిశబ్దము మృగ్యము. వచోఽభంగ (234) కృపాఽమంద (152) ఇట అకార ప్రశ్లేషము సద్యస్ఫూర్తిగా లేదు. భట్టుమూర్తిని వర్ణించుచు 'పెద్దన్నకు విద్యాస్పర్ధియై' (237) పెద్దన్నకు భట్టుమూర్తికి విద్యాస్పర్ధ యేమి? శ్రుతిసుందరమైన తెనుంగుసేత (129) శ్రీనాథుని యనువాదము చెవులకు మాత్రమే యింపైనదా? అనగా నర్థగాంభీర్యములేనిదనియా? లేక శ్రుతివలె (వేదము వలె) సుందర మనియా?

94 పద్యమున ఎఱ్ఱన, సోమన ప్రాక్పశ్చిమముల యందలి చంద్ర సూర్యులతో నుపమింపబడిరి. సూర్యచంద్రులాయాదిక్కులనొకేసమయమున నున్నచో నుదయ మెవ్వరికి? అస్తమయ మెవ్వరికి? పింగళిసూరన వర్ణనలో 'అకటా పింగళిసూరనార్య కవిచంద్రా కూర్ప నీకే తగున్ (224) ఇందు సంతాపార్థము ముఖ్యముగా నున్నది గాని యాశ్చర్యమో ప్రశంసయో ముఖ్యముగా లేదు. లక్ష్మీగురుసిద్ధి (158) లక్ష్మి యొక్క గురువైనసిద్ధియా లేక లక్ష్మీగురుని సిద్ధియా? సాధుసారంగ తమ్మయ్య (251) సాధుపదము పాదపూరణకో యతికో ప్రయుక్తమా? అహల్యా సంక్రందనంబును (277) సమాసమై అహల్యాసంక్రందన మను గ్రంథనామము నుద్దేశించినపదము సద్యస్ఫూర్తి లేదు. ఇట్టిదే 'జన్నిదపు పాపయ్యశాస్త్రి (429) శ్రీ జంధ్యాల పాపయ్య

శాస్త్రిగారికి వచ్చిన పదాంతరీకరణము. 348 పద్యము 'ఒక చరణంబతండు మరియొక్కటియాతడు' ఇది తిరుపతి వెంకటకవులు చెరియొక పాదముగా రచించిరను భావమున రచితము. కాని రెండు మారులు అతండు- ఆతడు- ఈ రెండుసర్వనామములొక్కనినే చెప్పును కాని యిద్దరను జెప్పవుకదా! ఒకచో 'సీతడు' ప్రయుక్తమైన బాగుండెడిది నానాయిడుమల్ (368) వంటి సమాసమును, విడిచిన బాగుండెడిది. నవ్యచనైక (282) ఇచట వర్థజ్ఞానము కలుగుటలేదు.

జంటకవు లగు నంది మల్లయ, ఘంట సింగనలను విడిచినారు. తెలుగు ద్రావిడ భాష యనుటకంటె సంస్కృత జన్య మని సిద్ధాంతీకరించిరి. భాషా శాస్త్రజ్ఞుల సమ్మతి కిది విరుద్ధము. 'పలికెడిది భాగవత మట' వంటి పద్యములు కొద్ది మార్పులతో రచింపబడినవి (143) ఇట్టివే. 64, 75, 85, 120, 169, 248.

శ్రీనాథ యుగమునాటి గౌరనను శంకరకవి (రాయల యుగాంతమువాడు) తరువాతఁ జెప్పుటవంటివి జరగినవి.

ఇందలి పద్యములన్నియు (దాదాపు) సరళార్థములై సుందరశైలిలో నిరాఘాట ధారగా నడచినవి. ప్రతిపద్యము, ప్రతిపదము శ్రీ కవిగారి భాషాప్రాభవమును, పాండిత్యమును, ఉక్తిచాతురిని, భావశాబల్యమును, వాఙ్మయాసక్తిని వెల్లడించును. శ్రీ కవిగారు సహజకవులు, పరంపరాగత పాండిత్యులు నగుటచే నీ మహాత్కార్యము స్థూలారుంధతీ న్యాయముగానైన సుమారు నాలుగువందల యేబది పద్యములుగా నిండినది. వాఙ్మయచరిత్రను కవి గుణనిర్దేశముతో నిట్లు పద్యరూపమునఁ దెచ్చినవారు నా యెరిగినంతవరకు వీరే యనుకొందును. వీరికి ప్రాచీన వాఙ్మయముపై నున్నంత గౌరవాదరములు నవీన కవితా ప్రక్రియలపై (నవల మున్నగువానిపై) లేవు. అది సహజమే కదా !

ఈ గ్రంథమునకుగల పీఠికలలో శ్రీ తూమాటి దోనప్పగారి ముఖబంధము సర్వార్థ సార్థకమై ప్రథమస్థానమును వహించుటయే కాక వారికి గల నిష్పాక్షికతను, సహృదయతను, విమర్శనాశక్తిని వ్యక్తము చేయుచు, శ్రీ కవిగారి సహృదయౌదార్య పాండిత్యాదులను వ్యక్తపరచుచున్నది. శ్రీ దివాకర్లవారు జగమెరిగిన బ్రాహ్మణులు. వారి తొలిపలుకు 'మెత్తని పలుకు' గా; గంభీరవిమర్శతో మృదుమధురముగా శ్రీ శాస్త్రిగారి రచనామార్గమును నిర్దేశించి సవరించుచున్నది.

ఈ గ్రంథమును పఠించుట బహుళార్థ సాధక మనుటలో సందేహము లేదు. శ్రీ శాస్త్రిగారి రచనలు మరిన్ని, మరింత యానందమును మనకు కలిగించుఁ గాక. ఇంతకంటె కోరదగిన దేమున్నది ?

— శ్రీ ప్రసాద్.

# సమాలోచన ఆవిష్కరణోత్సవ సభ

6-11-77 తేదీ ఆదివారం సాయంకాలం గం. 6 లకు గౌతమీ లైబ్రరీ యందలి బాబాయమ్మ మెమోరియల్ హాలులో హుషారుక్లబ్బు యాజమాన్యమున క్లబ్బు అధ్యక్షులు విద్వాన్ సీతారామశాస్త్రిగారిచే ప్రచురింపబడుచున్న సమాలోచన జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక ఆవిష్కరణోత్సవ సభ జరిగినది.

క్లబ్బు ప్రధానకార్యదర్శి డాక్టరు ఎం. రామకృష్ణారావుగారు స్వాగతము పలుకుచు అధ్యక్షులను, సభాప్రారంభకులను, పత్రిక ఆవిష్కర్తలను, ఉపన్యాసకులను, పత్రికా సంపాదకులను వేదికపైకి ఆహ్వానించగా, క్లబ్బు సభ్యులు శ్రీ పక్షి పకీరురావుగారు అందఱిని వరుసగా పుష్పమాలాలంకృతులను గావించిరి.

కుమారి సోమంచి శారదాదేవి సోదరీద్వయము గావించిన శ్లోక పద్య రూప ప్రార్థనతో సభ ఆరంభమైనది.

తూర్పుగోదావరిజిల్లా ప్రిన్సిపలు, సెషన్సుజడ్జి శ్రీ కోకా రంగరాయకులుగారు బి.కాం. ఆనర్సు. బి.ఎల్. అధ్యక్షోపన్యాసము గావించుచు "పత్రికలు సత్యదూరము కాని వార్తలను అందజేయాలి. పక్షపాత రహితమైన విమర్శలను ప్రచురించాలి. సాంఘిక, రాజకీయ, నైతికరంగాలలో సముచితస్థితిని ఏర్పరచుకోవాలి. విద్యలో, విజ్ఞానములో, అనుభవంలో పండిన శ్రీ బులుసు సీతారామశాస్త్రి సంపాదకత్వాన వెలువడే యీపక్షపత్రిక సమాలోచన అట్టి ఒరవడిలో నడుచుననుటలో సందేహము లేదు. వారికృషికి సహకారం, ప్రోత్సాహం అందచేయాలి." అని తెలిపినారు.

ప్రముఖ విద్యావేత్త, నవభారతీ గురుకుల వ్యవస్థాపకులు శ్రీ తన్నీరు బుల్లెయ్య ఎం. ఎల్. సి. గారు తలవనితలంపుగా అనివార్యకారణములవల్ల హైదరాబాదు వెళ్లవలసివచ్చినందున వారి సభాప్రారంభోపన్యాసమును గురుకులం హైస్కూలు హెడ్మాష్టరు శ్రీ ఐ. తమ్మిరాజుగారు చదివినారు. అనేక రంగాలలో ఆరితేరిన అనుభవంగల శ్రీ సీతారామశాస్త్రి సంపాదకత్వమున వెలువడే సమాలోచన సమాజానికి వెలుగు చూపగలదనే ఆశాభావాన్ని వారు అందు వ్యక్తముచేసిరి.

గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీ ప్రిన్సిపాలు శ్రీ ఆర్. యస్. సుదర్శనం గారు సమాలోచన ఆరంభ సంచికను ఆవిష్కరిస్తూ గొప్పసందేశ మొసగియున్నారు.

"అక్షరాస్యత పెరిగి ఏదోఒకటి చదవాలి అనే ఆసక్తి ఎక్కువయైన నేడు ఒకే మూసలో పోసినట్లు ఒకకథ, ఒక గేయం, ఒక వ్యాసం, ఒక సీరియల్ నవల, సినీమాబొమ్మలు, కల పత్రికలు వస్తున్నవి. కాని సాహిత్యం, దాని అభివ్యక్తి, దాని విలువలు, అనువానిని గురించి విచక్షణాయుతమైన సమీక్షాపత్రికలు తెలుగునాడులో (భారతి, ప్రభ, జ్యోతిమినహా) లేవు. మనసాహిత్యాన్ని సమీక్షించే పత్రికల అవసరాన్ని 'సమాలోచన' తీరుస్తుందని ఆశించుచున్నాను.

నేటి సినిమా విమర్శలవలె ఇచ్చిపుచ్చుకొనే ధోరణిలో కాకుండ గ్రంథములను గురించి సరియైన విమర్శలు రావలెను. అప్పుడే ప్రజలు మంచి పుస్తకాలను ఎన్నుకునే అవకాశం కలుగును. మంచి సమీక్షలు మంచి పుస్తకాలకు ప్రచారం కలిగించడంద్వారా, మంచి సాహిత్యాన్ని సమాజానికి అందించినట్లగును. మంచి సమీక్షలను సహించలేని ప్రచురణకర్తల వైఖరి సమంజసం కాజాలదు.

శ్రీ శివలెంక శంభుప్రసాద్ ప్రజ్ఞావంతులను గుర్తించి వారికి మరిమరీ వ్రాసి మంచి విమర్శనవ్యాసాలు తెప్పించి ప్రచురించేవారు. నాచే సాహిత్య దృక్పథాలనే విమర్శలను రచింపజేసిరి. వారి సాహిత్యసేవకు జోహారులు.

సాహిత్యంలో స్మరించకలసిన కథా నవలారచనలు సమాలోచనలో చోటు చేసుకోవాలి. సగం పేజీలలో అయినా సమీక్షలుండాలి. పఠితలకు సాహిత్యాభిలాష కలిగించేటట్లు సమాలోచన నడుపవలెను. ఆ కృషిలో విజయము కలుగుగాక'' అని తమ యుపన్యాసము గావించిరి.

సంపాదకుడు శ్రీ సీతారామశాస్త్రి పత్రికలమీద, విమర్శలమీద తమ కభిరుచి కలిగిన ఉదంతము వివరించి రాగద్వేషాలకి అతీతంగా సాహిత్యసేవకు అంకితమయ్యేటట్లు పత్రికను నడపుతే తన ఆశయమని తెలిపి పెద్దల సూచనలకు కృతజ్ఞత వ్యక్తపరచిరి. రచయితల సహకారమును అర్థించిరి.

పత్రికల నిర్వాహణకు డబ్బు సమకూర్చడం కష్టం. మంచి వ్యాసములను సేకరించడం అంతకంటెను కష్టము. చక్కని వ్యాసములను సంపాదించుటకు సంపాదకులు కృషిచేయాలి. శుక్లపక్షచంద్రునివలె సమాలోచన పత్రిక అభివృద్ధి నొందాలి అని మహాకవి శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి ఉపన్యసించిరి.

రాజమండ్రి సమాచారం సంపాదకులు శ్రీ గంధం సీతారామాంజనేయులుగారు దిన, వార, పక్ష, మాస పత్రికల తీరును వివరించిరి. "పక్షపత్రికలో మంచి వ్యాసాలతోపాటు ముఖ్యమైన వార్తలకుకూడ కొంతస్థానం కల్పించాలి. నేటి యీ సినిమాయుగంలో చౌకబారు సాహిత్యంవైపు వెళ్లే యువకుల దృష్టిని మంచి సాహిత్యంవైపు మళ్ళించే పత్రికగా 'సమాలోచన' రూపురేకలుదిద్దుకోవాలి. ఈ సాహిత్య నగరంనుండి వెలువడే యీపత్రిక పదికాలాలపాటు పరిఢవిల్లాలి'' అని ప్రసంగించినారు.

సుప్రసిద్ధ లాయరు, న్యాయవాణి పత్రికా సంపాదకుడు, హిందూ విలేఖరి, శ్రీ పోతుకూచి సూర్యనారాయణమూర్తిగారు మాట్లాడుచు "ప్రముఖులనుండి చక్కని వ్యాసాలు తెప్పించి ప్రచురించడమేకాక సమగ్రమైన సమీక్షలనుకూడ ప్రచురించాలి. భారతిపత్రిక స్థాయిలో ఎప్పుడెప్పుడు వచ్చునాయని యెదురుచూచునట్లు సమాలోచన తీర్చిదిద్దబడగలదని ఆసించుచున్నాను'' అనిరి.

డా. మాచిరాజు రామకృష్ణారావు వందనసమర్పణములతో సభ సమాప్త

---

# పల్వాల కొప్పులింగేశ్వర స్తుతి

— కొలచన వెంకటరమణమూర్తి.

* శ్రీ శివ నినుఁ బ్రార్థించెద
కాశీపురవాస! నన్నుఁ గరుణింపుమయా?
నా శిరము వంచి మ్రొక్కెద
ఆశీశ్శతములను నాకు ననయము నిమ్మా!

* ఫాలాగ్రంబున నర్ధచంద్రసిత శోభారమ్య తేజంబు నే
కాలంబున్ దగ మౌళిపైఁ గుటిల రంగద్గంగ నర్తింపగా
కేలన్ శూలముఁ బూని ఢక్క నొకచేఁ గీలించుచున్ నృత్యమున్
దాళం బొప్పఁగఁ జేయు శంకరుఁడు నిత్యమ్మున్ మమున్ బ్రోచుతన్.

* సర్వకాలంబులఁ బట్టి క్రింగంబడు
సోముఁడా నీకు చూడామణి యగు
కోరలందు విసమ్ము ఘోరమ్ముగాఁ జిమ్ము
భోగిచయము నీకు భూషణంబు
కదలదు మిగులంగఁ గఠినమైనది గిరి
తత్పుత్త్రియా నీకు దారయగుట
పచ్చగడ్డి భుజించి పడుచు లేచుచునుండు
బక్కయెద్దా నీకు వాహనంబు
నీదు తీరుచూడ నిక్కంబుగా నాకు
వింత తోచుచుండె విశ్వనాథ!
పల్వాల పురవాస! భక్తజన నివాస!
కొనుమ ప్రణతు లివియె! కొప్పులింగ!

* కణకణ నిప్పులఁ గ్రక్కుచునుండియు
మసలు కన్నా నీకు నొసటబొట్టు
కాలకూటవిషాన కటిరూపు దాల్చిన
కంధరంబా నీకు గట్టి భూష

కాఠిన్యమునమీాఱి కంపుకొట్టుచునుండు
మొరటు చర్మము నీదు మొలకుబట్ట
భూతపిశాచముల్ ప్రీతితోఁ దిరిగెడు
వల్లకాడా నీను వాసభూమి
నిన్ను వర్ణింప నీవై సి సన్నుతింప
నేరికిని శక్యమానె గారీశ ! దేవ !
పల్వాల పురవాస ! మహేశ ! పాపనాశ !
కూర్మిఁ గావుమా ! శ్రీ ఉమా కొప్పులింగ !

* సన్నుతిఁజేయఁ బూని కడుసంభ్రమ మావహిలంగ నేను నీ
వున్న తలంబుసేరి నిను నొప్పుగఁ జూడ నదేమి మాయయో
సున్నను దాల్చు భావములు చోద్యము ! తన్మయుడౌదు నీదు రూ
పోన్నతిఁగాంచి భక్తనయనోత్సవ ! పల్వాల కొప్పులింగమా !

* సారము లేదటంచిది విచారపుసాగర మంచు నెవ్వరీ
భారముఁ దాల్ప లేరనుచుఁ బల్కిన యార్యులదేమొగాని సం
సారమువందుఁ జిక్కికొనఁ జక్కఁగఁ బల్కిరి యేది ధర్మమో
వారిధరా ! హరా ! వృషభవాహన ! పల్వాల కొప్పులింగమా !

* మాయను బాప నన్ను గనుమా యను నమ్మితి నిన్నె వైరి కా
మా యను నిన్నుఁజేరఁగలమా యను పర్వతపుత్రికాభిరా
మా యను నాదుబాధ వినుమా యను మ్రొక్కుమునిమ్ము రౌద్రభీ
మా యను కీర్తి సేయతరమా యను భక్తుఁడు కొప్పులింగమా !

* మాయనుబంధముల్ దునుముమా యను పాపసమూహనాశ నా
మా యను పార్వతీహృదయమా యను భక్తమనోబ్జరూప ధా
మా యను నిత్యసత్యపరమా యను విష్ణుఁడవీవె భేద మే
మా యను సర్వపుణ్యధనమా యను భక్తుఁడు కొప్పులింగమా !

—0—

పురాణముగ భ్రమింపజేయుచు చరిత్రగ చదివింపజేయుచు
వినోద గ్రంథముగ తయారయిన

# శ్రీ భారతాంబ దాస్యవిమోచనము

## గ్రంథ విమర్శ

ఇది వచనగ్రంథము లసంఖ్యాకములుగ వచ్చుచున్న తరుణము! ఎవ రెక్కడ వ్రాయుదురో! ఎప్పు డచ్చయి వచ్చునో! ఏవి ఎందర కందునో! అగ్రాహ్యము.

పదిసంవత్సరముల క్రిందట అచ్చయినను, పదిమంది దృష్టికి రాకపోయిన, అది దృష్టికి వచ్చునపుడు నూతనగ్రంథమే అగును. ప్రస్తుత గ్రంథము వినూతనగ్రంథము. కథలకు కాళ్ళుండవని నిరూపించిన గ్రంథము.

ఒంగోలు జిల్లా కందుకూరు తాలూకా పాకలనివాసి శ్రీ అనుమాలశెట్టి లక్ష్మీనారాయణశ్రేష్ఠి దీని కర్త. సృష్టి ఆరంభమునుండి 1971 వరకు భారతదేశ సంబంధి విషయము లెన్నియో యిందు గలవు.

గ్రంథకర్తకుగల పౌరాణిక, చారిత్రక పరిజ్ఞానము ప్రశంసనీయమైనది. దేశభక్తియుత భావప్రదీప్త మగు ఈరచనమున ప్రత్యేకత ఒకటి కలదు.

అది మన నాయకుల పూర్వజన్మలకు సంబంధించినట్టిది.
'జయప్రకాశ్ నారాయణుడు పూర్వజన్మమున వశిష్ఠుడు'
'విక్టోరియా మహారాణి శ్రీమతి ఇందిరాగాంధిగా జన్మించినది'
'విఘ్నేశ్వరుడు రవీంద్రనాథ ఠాగూర్‌గా జన్మించినాడు'
'కుబేరుడు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగా జన్మించుట'
ఈ ఏవంవిధ శ్లిష్టకలతో రచన సాగినది.
వినోబాభావే లోకసంచారికదా! ఆయన పూర్వజన్మమున నారదుడట!
లవకుశులే వి. వి. గిరి, జి. యస్. పథక్‌లుగా జన్మించిరట!
వీరభద్రుడు టంగుటూరి ప్రకాశంగా జన్మించెనట!
గాంధీజీ సరేసరి. సాక్షాత్తు శ్రీమహావిష్ణువే ఆయనగా జన్మించినాడు.

లక్ష్మణుడు జవహర్‌లాల్‌గ, దేవరాజేంద్రుడు నేతాజీగా, బలిచక్రవర్తి ఆరవ జార్జిగా, జన్మించినారట!

గుణ సారూప్యముగల పురాణ పురుషులను శోధించి రచయిత వారికి మరుజన్మములు కల్పించి యుండెను. ఆశ్చర్యకర విషయము!

ప్రథమాధ్యాయమునందు పూర్ణానందస్వామిని సదానందు డను .)వ్యడు స్వాతంత్ర్య దినోత్సవమునుగూర్చి అడుగును. ద్వితీయాధ్యాయమున ఆ గురుదేవుడు

అది ఒకటియేకాదు సృష్టిరహస్యములు, వేదశాస్త్ర పురాణేతిహాసములు, చతుష్షష్టి కళలు మున్నగున వెన్నియో తెలుపును.

తృతీయాధ్యాయమున భారతాంబజననవృత్తాంత మున్నది.

తరువాత ఘట్టములలో భారతాంబ శ్రీహరితో 'మీ రెన్నో అవతారములెత్తి యెన్నో పుణ్యకార్యములు చేసితిరికదా, ఆంగ్ల పరిపాలనమునుండి నన్ను కాపాడి పుణ్యము గట్టికొం' డని పరిపరివిధముల ప్రార్థించును. శ్రీహరి ప్రసన్నుడై 'తన్వీ! నీవు కోరినటులే నేను వైశ్యకులమున జన్మించి, నీకిచ్చిన వరములను నెరవేర్చి, అనంతరము తిరిగి వైకుంఠమునకు చేరెదను' అన్నాడు.

చతుర్థాధ్యాయమున – శ్రీహరి సభలో – భారతదేశ కష్టములు వివరించి భారతాంబ దాస్యవిమోచనము చేయవలసి వున్నదని, ఆంగ్లేయులు భారతదేశ సంపదలు కొల్లగొట్టుచున్నారని, చెప్పును. ఆసభలో శంకరుడు ఈటీసీ అందఱును గలరు.

నారదుడు శ్రీహరితో – దినప్రళయము గల్పించిన నంతయును పోవును. సర్వ రాజ్యములు, రాజులుపోవుట జరుగును. అనంతరము సృష్టి ప్రారంభమగును ఎవరి దేశములో వారే పరిపాలించుకొందు రనినాడు. శంకరుడు – 84 లక్షల జీవరాశులను హతముచేసి – 44 కోట్ల భారతీయులకు మేలుచేయుట న్యాయవిరుద్ధము అనినాడు. పిదప శ్రీహరి గాంధీగా జన్మించినాడు. తరువాత జరిగిన పరిణామము లెన్నియో యిందు వ్రాయబడినవి. పంచమాధ్యాయమునందును, షష్ఠాధ్యాయమునందును, సప్తమాధ్యాయమునందును, ఎవరు ఏవిధముగ జన్మించినది వివరములు గలవు. అష్టమాధ్యాయమున పాకిస్తాన్ చరిత్ర, పాక్ విభజన కారణములు గలవు.

భారతమాత దాస్యవిమోచనము జరుగుట గ్రంథ పతాకస్థాయి సన్నివేశము.

భూలోక పుణ్యపురుషులు గ్రామపంచాయతీ బోర్డు సభ్యులుగ జన్మించగా మహర్లోకవాసులు రాష్ట్రశాసనసభ్యులుగా, స్వర్గలోకవాసులు జిల్లా పరిషత్ ఛైర్మనులుగా జన్మించిరని– ఈవిధముగ కల్పనలు! ఒకటే కల్పనలు!! కొన్ని ఆసక్తికరముగ నుండగా; కొన్ని పుటల దండుగగా నున్నవి. పిచ్చితుగ్లక్ భుట్టోగా జన్మించుట బాగున్నది. భస్మాసురుడు యాహ్యాఖాన్ గా జన్మించుట మరింతగా బాగున్నది. బాగులేని దేమి? కథాకల్పనాపాటవ లోపము.

చిత్రచిత్రముగ నటనట ఆసక్తికర సంఘటనలు అధికముగ మిళితమై యుం◯చో నిది 'కాశీమజిలీలవంటివి' కాకపోయినను దానికి సమీపస్థానమును సంపాదించుకొని యుండెడిది.

అష్టాధ్యాయ సమన్వితమైన ఈ గ్రంథము అటు పురాణముగాక, నిటు చరిత్ర కాక, కల్లబొల్లికబుర్లు గాక; పురాణ చారిత్రక రాజకీయాంశ సమ్మిళితమై మొత్తము మీద పాఠకుల కాసక్తి కలిగించు వచన కావ్యమై చూచిన ప్రతివాడు చదువగోరు టెక్నిక్ కలిగియున్నది. మధ్యమధ్య రచయిత పేరుకొన్న శ్లోకములును, పద్యము లును మున్నగువానిని గమనించినచో శ్రీ అనుమాలశెట్టి గారి పాండిత్యము సామాన్య మైనది కాదని తేలుచున్నది. గ్రంథప్రారంభమున 'ఎనిమిది' పరిచయములుగలవు.

రచయితలు అమూల్యకాల సంహారకులు కారాదు. ప్రణాళికా సమన్వితరచనా దృక్పథము గలిగిఉండవలెను. అనవసర సందర్భములలో రచనను సాగదీయుట పాఠ కులచే గుంజీలు తీయించుటవంటిదిగా భావించవలెను.

ఈ 350 పుటల ఉద్గ్రంథమున విషయముల కన్న విషయసూచికే ఆసక్తి దాయకముగా నున్నది. రచయిత మలి ముద్రణమున ప్రతిభా శోభితములగు కల్పనల ఘట్టములు సందర్భోచితముగా సమకూర్చిన; ఈ గ్రంథము పాఠకుల ఆదరాభిమాన ములను విశేషముగఁ జూరగొనుట తథ్యము.

తొలిపుటలఁగల పరిచయములలో నొకటి వ్రాసిన శ్రీమతి ఊటుకూరి లక్ష్మీ కాంతమ్మ "శ్రీ లక్ష్మీనారాయణ శ్రేష్ఠిగారు పురాణ రచనా విధానమున భారత దాస్య విమోచన మను పేరుతో మనకాంగ్రెసు ఉద్యమ చరిత్రకు సమగ్రమగు రూప కల్పన మొనర్చినారు" అనుట సరికా దనిపించును. ఇందలి వివిధ విషయములను సంపూర్ణముగ ఆకళించుకొనిన "ఇది కాంగ్రెసు ఉద్యమచరిత్రకు సమగ్ర రూపకల్పన కాదని తెలియును." భారతాంబ దాస్యవిమోచన మను నామ మట్టి అపోహ గలిగిం చుట కాస్కారమై యుండును.

నవలవలె చదివింప జేయు దీనిలో గ్రహించదగిన జ్ఞానాంశములు బహుముఖ ములుగా నున్నవి.

ఇది భారతీయ భారతీయేతర నాయకుల పూర్వజన్మ కల్పనలతో వాస్తవిక చారిత్రక సంఘటనలతో, కూడుకొని వినోద మధికముగ నందించు గ్రంథ మయినది. గ్రంథకర్త ఇట్టి ప్రత్యేక గ్రంథము వ్రాయుట పేర్కొన దగినది.

– శ్రీ సన్నిధానం నరసింహశర్మ.

---

శ్రీ భారతాంబ దాస్యవిమోచనము – రచయిత: శ్రీ అనుమాలశెట్టి లక్ష్మీనారాయణ శ్రేష్ఠి, 350 పుటలు. వెల 5 రూ॥లు. ప్రతులకు : రచయిత, పాకల, ఒంగోలుజిల్లా.

ఈ పక్షంలో......

## దైవ రక్షితుడు

జోర్హాట్ విమాన ప్రమాదంలో సుశిక్షితమైన విమాన సిబ్బందిలో ఐదుగురు మరణించారు. అనేకులు గాయపడ్డారు. విమానం శిథిలమైపోయింది. అందు ప్రయాణిస్తున్న సహాప్రమాసజీవి, మన ప్రియతమ ప్రధాని, మొరార్జీ దేశాయ్ చెప్పదగిన గాయమైనా ఏమీ లేకుండా విమానము పతనమైన చోటినుండి చకచక నడిచివెళ్ళి ప్రమాదమునుండి తప్పించుకొని దైవాస్తిత్వమును నిరూపించియున్నారు. దైవరక్షితుడైన ప్రధాని భవిష్యత్తు, తద్వారా దేశభవిష్యత్తు ఉజ్జ్వలముగా వెలుగొందగలవని ఆశించుచున్నాము.

## కవిసార్వభౌముడు

రాజమండ్రిలో ఈనెల 2వ తేదీని శతాధిక గ్రంథకర్త, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి 112వ జన్మదినోత్సవము జయప్రదముగా జరిగినది. మునిసిపలు ఆఫీసు ఆవరణములోని శాస్త్రిగారి శిలావిగ్రహము పూజింపబడినది. ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాలు శ్రీ ఆర్. యస్. సుదర్శనంగారి అధ్యక్షతను జరగిన బహిరంగ సభలో ప్రముఖులనేకులు కవిసార్వభౌముని జీవిత కవితా వైశిష్ట్యమును పెక్కువిధముల ప్రస్తుతించి వారియెడగల భక్తిగౌరవములను ప్రదర్శించిరి.

## మృత్యుంజయ విగ్రహము

### సవాలు - ప్రతిసవాలు

గోదావరి రైల్వేస్టేషనుకు సమీపమున నాలుగురోడ్ల కూడలిలో ఇటీవల ప్రతిష్ఠింపబడిన మృత్యుంజయ విగ్రహ శిల్పదోషములను గురించి అవాంఛనీయములైన వాద ప్రతివాదములు చెలరేగినవి. సవాలు, ప్రతిసవాలు విసరబడినవి. నిందారోపణములతో కరపత్ర ప్రచురణమును జరగినది. రాజమండ్రి పురప్రముఖులుగా భావింపబడుచున్న శ్రీ నార్ని కేదారేశ్వరుడుగారు శిల్పమున దోషము లున్నవని, దానివలన పట్టణమునకు హాని కలుగగలదని, సభాముఖమున తెలిపియుండిరి.

24 గంటలలో దోషములను నిరూపింపవలసినదని, అట్లు నిరూపించిన తన బిరుదములను త్యజించి, శిల్పరచనమానుకొందు నని, శిల్పి అచ్యుతంగారి ప్రతిజ్ఞ. పండితసభలో దోషములులేవని ఋజువైనయెడల తన బిరుదములను పరిత్యజించుటేకాక ఇంకెవరికి సన్మానములు చేయుట మానుకొందు నని కేదారేశ్వరుడుగారి విచిత్ర శపథము.

దోషములు కలవని చెప్పిన కేదారేశ్వరుడుగారవి యెట్టిదోషములో వివరించి యుండవలసినది. అవును కాదు అనుటకు పండితసమావేశ మవసరమేమోకాని తాము అన్న దోషము లివి అని పేర్కొనుట కది యవసరము లేదుకదా.

దోషములున్నట్లు బుజువైన; వానిని వీలయిన సవరించికొనుట మంచిదికాని బిరుదములను, శిల్పరచనను, త్యజించుటవలన నెవరి కేమి మేలుకలుగును ? ఉభయులకు నింతఃపూర్వము వ్యక్తిగత రాగద్వేషకారణములు లేవుగదా !

ఏకారణముచేతనైనను బిరుదత్యాగము చేయు మంచితలంపు వారికి గలిగిన; ఈ నెప మనవసరము.

దోషములను వివరించి, సవరింపించి నగరమునకు రాఁగలయుపద్రవమును తొలగించు ఆత్రము ఉభయులలో నెవరికి నున్నట్లు కనఁబడకపోవుట విచిత్రము.

## ఆంధ్రరాష్ట్రావతరణోత్సవములు

అమరజీవి పొట్టి శ్రీరాముల యాత్మత్యాగముతో సిద్ధించిన ఆంధ్రరాష్ట్రావతరణమునకు సంబంధించిన ఉత్సవములు రాష్ట్రము నలుమూలల ఉత్సాహభరితముగా జరగుచున్నవి. అనేక సాంస్కృతిక కార్యక్రమములు నిర్వహింపబడుచున్నవి. జాతి కొఱకాత్మార్పణము గావించిన మహాత్ముని సంస్మరించి జోహారు లర్పించుట రాష్ట్ర ప్రజల కనీసధర్మము కదా.

## బాలల దినోత్సవము.

14-11-77 న జాతీయ నాయకుడు జవహర్‌లాల్ నెహ్రూ జన్మదినోత్సవము. Children's day గా ప్రసిద్ధికెక్కిన పర్వదిన మది. భారతజాతి యావత్తు జాతి యున్నంతకాలము నివాళు లర్పింపవలసిన మహాపురుషులలో జవహర్‌లా లొకడనుట నిర్వివాదమైన అంశము.

చిల్డ్రన్స్ డే కి ఆంధ్రీకరణముగా బాలలదినోత్సవ మని ఎవ రెవరు పేర్కొనిరో కాని బాలలు అనగా ఆడుపిల్లలే కాని మగపిల్ల అని యర్థము చెప్పుటకే కోశాన ఆస్కారము లేదు. బాల దినోత్సవము అనదగును. లేదా ఆంగ్లపదమునే ఉపయోగించుట మేలు.





## —* సమాలోచన - శుభాకాంక్షలు *—

### ప్రభుత్వాస్థాన కవి డా. శ్రీ దాశరథి.

సమాలోచన అందినది. జమదగ్ని గారి 'సాహిత్య విమర్శ' మధునాపంతులవారి 'తెలుగువారి సరస్వతి' చదివాను. అద్భుతంగా ఉన్నాయి వ్యాసాలు. మిగతావి చదువుతాను. అనేక వ్యయప్రయాసలకోర్చి తాము జాతీయసాంస్కృతిక పక్షపత్రికను వెలువరిస్తున్నందుకు అభినందనములు. తమ పత్రికకు అశేష పాఠకజనాదరాభిమానములు లభించుగాక. మీకృషి ఫలించుగాక. శుభాకాంక్షలతో

— మీ దాశరథి.

### శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు, హైదరాబాదు.

తమరు దయతో పంపిన సమాలోచన ప్రారంభ సంచిక చేరినది. ఆరంభోత్సవమునకు అనారోగ్యమున రాలేకపోవుచున్నాను. పత్రికలోని వ్యాసములు, తమ ఆశయములు చూచితిని. ఇట్టి ఉన్నతాదర్శములతో గూడిన పత్రిక యిప్పుడు తెలుగు దేశమున అత్యంతావశ్యకమైయున్నది. ఆ ఆవశ్యకతను వేదవిద్యావిశారదులు, అనుభవజ్ఞులు, ఉభయభాషాపండితులునైన తాము తీర్చబూనుట చాలముదావహము. పత్రికా నిర్వహణము క్లేశకరమయ్యు తమ సంకల్పబలముచే నీపత్రిక చిరకాలము నిర్విఘ్నముగా సాగి దేశమున ఉన్నతాదర్శములు నెలకొల్ప జాలునని ఆశించుచున్నాను.

### డాక్టరు వి. వి. యల్. నరసింహారావుగారు, మాచర్ల.

'సమాలోచన' లో ప్రచురితమైన రచనలు చూచితిని. ఉన్నతస్థాయిలోనున్నవి. మీరు ప్రారంభించిన కార్యము నిర్విఘ్నముగా జరగగలదను విశ్వాసము కలుగుచున్నది.



## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూఁత నీయఁ బ్రార్థన. రచనలు సరళ గ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును.

వివాదాస్పదములుగాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ, విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధ ప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలనైనఁ బ్రచురించుట మా యభిలాష.

రచన మాకుఁ జేరిన వారము రోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడని రచనలు త్రిప్పిపంపుటకు తగిన తపాలాస్టాంపులు రచనలతోపాటు పంపవలయును.

క్రొత్త పుస్తకములను రెవ్యూకి పంపువారు రెండు కాపీలు పంపఁగలరు. పంపఁబడిన ప్రతి పుస్తకము మీఁదను వీలయినంతవఱకు రెవ్యూ ప్రచురింపఁబడును.



